# గాంధి తత్త్వం-గాంధి దృక్పథం



రచన
కె. ఎమ్. మున్షి
అనువాదం
క్రొవ్విడి వేంకటరమణారావు

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
[ ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి ]
హైదరాబాదు-20

మొదటి కూర్పు 1969
2000 ప్రతులు సెప్టెంబరు

విషయసూచిక



సర్వోదయ ప్రెస్
విజయవాడ-6

వెల
80 పైసలు

# ప్రకాశకుల నివేదన

గాంధీ తత్త్వాభివృద్ధికై భారత ప్రభుత్వ విద్యాశాఖవారు ఏర్పరచిన ప్రణాళిక ప్రకారం ప్రతి సంవత్సరం ఒక విశ్వ విద్యాలయంలో గాంధీతత్త్వ నిష్ణాతులైన ప్రముఖునిచే మూడు ఉపన్యాసాలు ఇప్పిస్తారు. ఇప్పటికి అనేక విశ్వవిద్యాలయాల్లో ఇట్టి ఉపన్యాసాలు జరిగాయి. భారత ప్రముఖులలో ఒకరును గాంధీజీకి చిరకాలం సన్నిహిత సహచరులుగా ఉన్నట్టి శ్రీ కె. యమ్. మున్షీ, అన్నామలై విశ్వవిద్యాలయంలో మూడు ఉపన్యాసాలు ఇచ్చారు. మొదటి ఉపన్యాసం ఆధ్యాత్మికవాదిగా గాంధీజీ; రెండవది ఉపదేశకుడుగా గాంధీజీ; మూడవది ప్రవక్తగా గాంధీజీ. ఈ మూడు ఉపన్యాసాలను గాంధి తత్త్వం – గాంధి దృక్పథం అనే పేరుతో భారతీయ విద్యాభవన్‌వారు ఆంగ్లంలో ప్రచురించారు. దానికి తెలుగు అనువాదము ఇది. అనువాదకులు శ్రీ కొవ్విడి వెంకట రమణారావుగారు.

ఈ పుస్తకాన్ని ఆంధ్రపాఠకలోకానికి గాంధితత్త్వం గురించి సక్రమంగా తెలుసుకోడానికి, నూతన దృక్పథంతో పరిశీలించడానికి చాలా సహాయకారి కాగలదని నా విశ్వాసం. భారతప్రభుత్వంవారు, వారు ఇప్పిస్తూన్న ఉపన్యాసపరంపరను తెలుగులో ప్రచురించడానికి మాకు అనుమతి ఇచ్చారు.

వారికి మా కృతజ్ఞతలు. అనువాదకులకు, ముద్రాపకులకు మా కృతజ్ఞతలు. ఆంధ్రపాఠంలోకం మా యీ ప్రయత్నాలను ఆదరిస్తుందని నమ్ముతున్నాను.

ఇట్లు,

కోదాటి నారాయణరావు

కార్యదర్శి

సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

హైదరాబాదు-20

30—9—1969

# 1

# ఆధ్యాత్మిక వాదిగా గాంధీజీ

గాంధీజీ మహిమాన్వితమైన వ్యక్తిత్వాన్ని గురించి ప్రసంగించడం నాకు కష్టసాధ్యమైన పని. ఎందుకంటారా మహాత్ముడు మన కతి సన్నిహిత సమకాలీనుడు. ఇంతేకాదు, జీవితంలో ఆయనకు నేను సన్నిహితుణ్ని.

గాంధీజీ "చిన్నమనిషి" మోహనరూపుడు కాడు. ఆయనది బక్కచిక్కిన శరీరం. కాని, ఎట్టి దౌష్ట్యమునకు కూడ లొంగని అచల శక్తి ఆయనది.

గాంధీజీ సమకాలీనుడు, ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన ప్రసిద్ధ శాస్త్రవేత్త, సత్యాన్వేషి అయిన ఐన్‌స్టీన్ ఇలా అన్నారు: "గాంధీజీవంటి మహామనీషి వాస్తవంగా ఈ భూమిమీద నడయాడారా ?అని రాబోయే తరాలవారువిస్తుపోయి నమ్మలేనంతటి విశిష్టమైనవ్యక్తిత్వం మహాత్ముడిది."

అర్ధనగ్నంగావుండే ఈ యోగిపుంగవుని అపారమైన శక్తియుక్తులకు కారణమేమిటి ? తనను విశ్వసించి తన అనుచరులైన వారిపైననే కాక, తనతో ఏకీభవించే వారిపైననే కాక, తనను విమర్శించి విరుద్ధాభిప్రాయాలు కలవారిపైన కూడా గాంధీజీ అనంతమైన ప్రభావాన్ని ప్రసరింపచేసేవారు. ఈ విజయానికిగల కారణమేమిటి? రహస్యం ఏమిటి ?

నా ప్రసంగంలో మూడు అంశాలను గురించి మీకు వివరిస్తాను. "ఆధ్యాత్మికవాదిగా గాంధీజీ, ఉపదేశకుడుగా గాంధీజీ, ప్రవక్తగా గాంధీజీ."

చారిత్రకదృష్ట్యా కాని, మానవస్వభావందృష్ట్యా కాని గాంధీజీని అంచనా వేయబూనడం సవ్యమైన పనికాదు. ఎందుకంటే ఆయన మనకు సన్నిహితుడైన సమకాలీనుడు.

గాంధీజీ అపూర్వమైన మహామనీషి. ఆయన 75 వ జన్మదినోత్సవ సందర్భంగా గాంధీజీని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఇలా స్తుతించారు :

"లక్షలాది భారతీయులను ఆకట్టుకొన్న మహాత్ముని వినూత్నమైన, అత్యద్భుతమైన వ్యక్తిత్వాన్ని గురించి ఒక చిన్న పుస్తకంలో చెప్పగలమా ? అణుబాంబుల ప్రళయ ఘోషతో ఘూర్ణిల్లుతున్న ఈ ప్రపంచంలో- ద్వేషం, హింస స్వైరవిహారం చేస్తున్న ఈ ప్రపంచంలో- శాంతినీ, సౌహార్ద్రాన్నీ, సుహృద్భావాన్నీ ప్రబోధిస్తున్న ఈ మహా మనీషి దుష్టశక్తులకు సవాలు. అపారమైన ఈ బలం ఆయన కెక్కడినుంచి వచ్చినది ? ఈ శక్తి, ఈ అధికారం ఆయన కెక్కడనుండి వచ్చాయి ? యుగాలతరబడి భారతదేశానికి బలాన్నీ, పుష్టినీ సమకూరుస్తున్న అతి గోప్యమైన జీవన స్రవంతిలో ఈయన ఏమైన సేవించాడా ?"

1948 లో నా డైరీలో ఇలా వ్రాసుకున్నాను : "సేవాగ్రాంలో ఒకరోజు గడపడం నిజంగా అద్భుతమైన అనుభూతి. ప్రజాజీవితానికి సంబంధించిన ప్రతి అంశంపైనా అంతో ఇంతో ప్రభావాన్ని ప్రసరించే గాంధీజీ దినచర్యలో ఆహారం, నిద్ర, ప్రార్థన, ఏకాంతవాసం, వ్యాయామం ఇవన్నీ నిర్ణీత వేళలలో జరిగేవి. ఈ అన్నింటికీ వ్యవధి కూడా వుండేది. నిద్ర లేవడానికి పవిత్రమైన వేళగా మన

మహర్షులు నిర్ణయించిన బ్రాహ్మీముహూర్తంలో, తెల్లవారు ఝామున నాలుగుగంటలకు, గాంధీజీ మేల్కొంచేవారు. ప్రార్థన చేసేవారు. అనంతరం వాహ్యాళికి వెళ్ళేవారు. ఈ సమయంలో ఆయనతో ఒక స్నేహితుడుకాని, రాజకీయ వేత్తకాని, ఆయన అడుగుజాడలలో నడిచే అనుచరుడుకాని ఎవ్వరో ఒకరు వుండేవారు. ఆయన అనారోగ్యంపాలు కావడంతో ఈ మధ్యన సూర్యోదయానంతరం ఆయన వాహ్యాళికి వెడుతున్నారు. ఆయనంటే భక్తిప్రపత్తులున్న జనసమూహం కొద్దిపాటి దూరంలో ఆయనను అనుగమించడం అప్పుడప్పుడూ జరుగుతూ వుండేది.

"తిరిగివచ్చినతర్వాత ఆయన దినచర్య ప్రారంభమయ్యేది. ఒక అనుచరుడు ఆయనకు మర్దన చేస్తూవుంటే తనను కలుసుకొనవచ్చిన వారితో సంభాషణలు జరిపేవారాయన. లేఖలు చదివి వినిపించేవారు. వీటిల్లో గాంధీజీని ఆరాధించే అమెరికనులనుంచి, బ్రిటిష్ విలేఖరులనుంచి వచ్చిన ఉత్తరాలు, ఆర్థిక సహాయం కోరేవారు వ్రాసిన జాబులు వుండేవి.

"ప్రతి కాగితంలోనూ వ్రాయకుండా మిగిలివున్న ఖాళీభాగాన్ని జాగ్రత్తచేసి వుంచాలి. వీట్లపైన జవాబులు వ్రాయబడేవి. హానికరంకాని రీతిలో నిరపాయకరమైన వ్యంగ్యభరితమైన హాస్యోక్తులు విసురుతూ ఉండేవారు. దీని వల్ల విసుగుపుట్టించే క్షణాలు ఉత్తేజకరంగా గడిచేవి. చిన్నపిల్లలతో ఆడుతూ పాడుతూ కేరింతలు కొట్టేవారు. అనుచరుల ఆంతరంగిక సమస్యలను పరిష్కరించేవారు. అను

యాయులలో ఒకరితో మరొకరికి వచ్చిన వైషమ్యాలను సమయింపచేసేవారు.

"ఇన్ని కార్యకలాపాలను పెట్టుకుని దేశవ్యాపితంగా వున్న అనేక సంస్థలకు మార్గదర్శకత్వం నెరపవలసివచ్చేది. భారతదేశం అంతటా వున్న ప్రముఖ కాంగ్రెసు కార్యకర్తల కార్యకలాపాలను అదుపుచేయడం, మతవైషమ్యాలు, అస్పృశ్యత వంటి సమస్యలను పరిష్కరించడం, కాంగ్రెసు వంటి బృహత్తరమైన సంస్థ కార్యక్రమాలపై అజమాయిషీ - ఇవన్నీ ఆయన చేయవలసివచ్చేది. మధ్యవర్తుల ద్వారా బ్రిటిష్ రాజకీయవేత్తలతో వ్యవహరించేవారు.

"దైనందిన జీవితంలోని అనుభవాలకు అనుగుణ్యంగా అహింసాసూత్రాన్ని అనువర్తింపచేయాలి. సత్యాగ్రహ సిద్ధాంతాన్ని, పద్ధతులను గురించి భాష్యం చెప్పాలి. ఇవన్నీ చేస్తూ ప్రార్థన, మననంద్వారా యోగికివుండే ప్రశాంత చిత్తాన్ని, నిరాసక్తమనస్కతను పెంపొందించుకోవాలి, ప్రదర్శించాలి. రైల్వేస్టేషన్, టెలిగ్రాఫ్ వంటి సౌకర్యాలు లేని ఒక గ్రామంలో రక్తపుపోటుతో బాధపడుతూ అనారోగ్యంగా వున్న తరుణంలో గాంధీజీ ఇవన్నీ చేయవలసి వచ్చేది."

భక్తి, ప్రేమ, అహింస అవలంబించే ఆధ్యాత్మిక వాదుల కోవకు చెందినట్టివారు గాంధీజీ. మతం, జాతి, కుల వివక్షత లేకుండా ఇట్టివారు ప్రేమసిద్ధాంతంద్వారా భగవత్ సాన్నిధ్యాన్ని సాధించినట్టివారు. భక్తి ప్రేమద్వారా, ఈ

విశ్వాన్ని నడిపిస్తున్న శక్తితో, మనం భగవంతుడు అని అంటున్నామే ఆయనతో మమేకం పొందేవారు.

అటువంటి ఆధ్యాత్మిక వాదులను భగవద్గీత ఇలా అభివర్ణిస్తున్నది :

"ప్రాపంచిక సుఖాలకోసం ప్రాకులాడుతూ సాధారణ మానవులు జాగ్రదవస్థలో వుండే ప్రపంచంలో వారు సుషుప్త్యవస్థలో వుంటారు. సాధారణమానవులు సుషుప్త్యవస్థలో వుండే ఆధ్యాత్మిక ప్రపంచంలో వారు జాగ్రదవస్థలో వుంటారు."

ఈ ఆధ్యాత్మికవాదులు ప్రవచించేది హిందూమతమైనా, బౌద్ధమతమైనా, క్రైస్తవమతమైనా వారు అవలంబించే భక్తిమార్గం, ఆధ్యాత్మికమార్గం యుగయుగాలనుంచి ఒక్కటే.

ఈ మార్గంలో విజయవంతంగా పురోగమించే వ్యక్తిని గురించి భగవద్గీతలో కృష్ణభగవానుడు ఇలా వర్ణిస్తాడు :

"అట్టి ఆధ్యాత్మిక వాది అహంభావాన్ని, అహంకారాన్ని, కామాన్ని, క్రోధాన్ని, మాత్సర్యాన్ని పరిత్యజిస్తాడు. నీవు, నేను అనే భేదభావాన్నుండి విముక్తుడై అన్ని వేళలా ప్రశాంతచిత్తుడై వుంటాడు. ఆవిధంగా ఆ వ్యక్తి భగవంతునియందు తన చిత్తాన్ని లగ్నంచేసి భగవంతునితో సారూప్యతను పొందే అర్హతను సముపార్జించుకొంటాడు.

"ఆ విధంగా భగవద్భక్తిని, అనురక్తిని సాధించిన తర్వాత అతడు చింతించడు, కాంక్షించడు. సంకల్ప వికల్పాలు వుండవు. సర్వ జీవకోటిని తనతో సమానంగా చూచుకొంటాడు, భావిస్తాడు. ఆ విధంగా నాపట్ల మహోన్నతమైన ప్రేమను పెంపొందించుకొంటాడు.

"అటువంటి ప్రేమద్వారా అతడు సత్యమే నేనని తెలుసుకొంటాడు. నేను ఏమిటో, ఎవరో తెలుసుకొంటాడు. నన్ను తెలుసుకొన్న తర్వాత నాలో జీవిస్తాడు. అన్నివేళలా నా శరణు కోరుతూ అత్యవసరమైన కర్మలు చేస్తాడు. నా కృపావిశేషంతో అతడు అనశ్వరుడై శాశ్వతత్వాన్ని పొందుతాడు.

"తాను చేసే కర్మల ఫలితాన్ని నాకు ధారపోస్తూ, అంటే నిష్కామకర్మయోగియై, గమ్యాలన్నిటిలోకి మహోన్నతమైన గమ్యం మోక్షాన్ని కాంక్షిస్తూ, నాయందే తన చిత్తాన్ని లగ్నంచేసి యోగమార్గాన్ని అవలంబిస్తాడు."

ప్రపంచంలో ఏ మూలనున్న ఆధ్యాత్మిక వాదులైనా అవలంబించిన భక్తిమార్గం ఈ క్రిందివిధంగా వున్నదని ప్రొఫెసర్ అండర్‌హిల్, ప్రొఫెసర్ సోరొకిన్‌లు చేసిన పరిశోధనలవలన తేలినది. ఆ మార్గం ఇది: మొదటిది - భగవంతునిపట్ల అనురక్తిని, చైతన్యాన్ని పెంపొందించుకోవడం; రెండవది - అనుబంధాలవల్ల ఏర్పడే ప్రలోభాలను, విలువలను, క్రోధాన్ని, మాత్సర్యాన్ని విసర్జించడం; మూడవది - వైయక్తిక జీవితాన్ని పరిశుద్ధం చేసుకొనడం;

నాలుగవది – భగవంతునికి ఆత్మార్పణం చేసుకోనడం; అయిదవది – భగవంతునితో సారూప్యత పొందటం; ఆరవది – నశ్వరమైన వస్తువులనుంచి విముక్తిపొందడం.

సనాతన మతానుయాయి అవలంబించే పద్ధతులకు ఆధ్యాత్మికవాది అవలంబించే పద్ధతులకు భేదం వున్నది. మరణానంతరంవరకు వేచివుండక వీలైనంత త్వరలో భగవంతునితో మమేకం పొందాలని ఇతడు కాంక్షిస్తాడు. ఇందువల్ల ఇతడు మతం ప్రవచించిన పద్ధతులకంటె ఉన్నత పథంకు వెళ్ళగల్గుతాడు. భగవంతునితో మమేకం పొందడమే ఇతడి లక్ష్యం. అందువల్ల ఈ లక్ష్యానికి భిన్నమైన ఏ ఇతర అంశంతోనూ ఇతడు తృప్తిపొందడు.

దుర్గమమైన ఈ మార్గం చివర ఆధ్యాత్మికవాది "అందరిలోనూ అన్నింటిలోనూ భగవంతుణ్ణి, భగవంతుడిలో అన్నింటినీ" చూస్తాడు. ఆవిధంగా అతడు తనచేత అచేతన శక్తు లన్నింటిపైనా అదుపును సంపాదించుకొని భగవంతుని ఉపకరణంగా మారిపోతాడు.

హారిజన్‌లో వ్రాస్తూ గాంధీజీ ఇలా వివరించారు:

"మానవుని అంతిమలక్ష్యం భగవంతునిలో లీనం కావడం. చేసే ఏకర్మ అయినా అతని కార్యకలాపాలు ఎట్టివైనా సాంఘికమైనావైనా, రాజకీయపరమైనవైనా, మతపరమైనవైనా వాటి అంతిమలక్ష్యం భగవద్దర్శనంగా ఉండాలి."

జీవితంలో తన స్వీయలక్ష్యాన్ని గురించి వివరిస్తూ గాంధీజీ ఇలా వ్రాశారు:

"గత 30 ఏళ్ళనుంచీ నేను సాధించదలచుకొన్నదీ సాధించడానికి శ్రమిస్తున్నదీ ఆత్మను సాక్షాత్కరింపచేసుకో వాలని, భగవంతుణ్ణి ప్రత్యక్షంగా దర్శించాలని, మోక్షాన్ని పొందాలని. నేను ఏమి వ్రాసినా, ఏమి మాట్లాడినా అవి రాజకీయరంగంలో నా కార్యకలాపాలు, ఇవన్నీ ఈ లక్ష్యం వైపు ఉన్ముఖమైనట్టివి."

ఇంతేకాదు - కొన్నికొన్ని సమయాలలో గాంధీజీ భగవంతుని సమ్ముఖానికి వచ్చారనే అనాలి. ఇందుకు ఒక ఉదాహరణ : ఆత్మపారిశుద్ధ్యంకోసం ఆయన చేసిన 21 రోజుల నిరాహారదీక్ష. ఆరవరోజు వచ్చేవరకే ఆయన మృత్యుముఖంలో పడేంత ప్రమాదకరంగా పరిస్థితి పరిణ మించడంతో ఆయన విడుదలఅయ్యారు.

పెషావరులోని ఇస్లామియా కాలేజీలో పనిచేస్తున్న ఒక ప్రొఫెసర్ వేసిన ప్రశ్నకు గాంధీజీ జవాబు ఇస్తూ ఆ సందర్భంలో భగవంతుడు తనతో ఏవిధంగా సంభాషించి నదీ ఇలా వివరించారు :

"నేను జైలులో వుండగా 21 రోజుల నిరాహార దీక్ష వహిస్తానని ప్రకటించినప్పుడు ఈ విషయంగురించి నేను అంతగా ఆలోచించుకోలేదు. అంతకుక్రితంరోజు రాత్రి నేను శయనించినప్పుడు మర్నాటి ఉదయం 21 రోజుల నిరాహార దీక్ష నేను వహించనున్నట్లు ప్రకటించనున్నానని నాకు తెలియనే తెలియదు.

"కాని అర్ధరాత్రివేళ ఒక వాణి నన్ను నిద్రలేపి ఇలా అన్నది : 'నిరాహారదీక్ష వహించు', 'ఎన్నిరోజులు?' అని

నేను అడిగాను. '21 రోజులు' అని జవాబు వచ్చింది. కాని, ఈ నిరాహారదీక్ష వహించడానికి నే నప్పటికి మానసికంగా సమాయత్తం కాలేదు. నా కది ఇష్టంగాకూడా లేదు. కాని, నేను దాని నవలంబించక తప్పలేదు.

భగవంతుణ్ణి ముఖాముఖి సందర్శించడంలోని కష్ట నిష్ఠూరాలను గురించి గాంధీజీ మరొకచోట ఇలా వివరించారు : ఈ విశ్వమంతా వ్యాపించివున్న, సర్వశక్తిమంతమైన సత్యాన్ని ముఖాముఖి సందర్శించాలంటే ఈ సృష్టిలో హీనాతిహీనమైన ప్రాణినికూడా తనలాగానే ప్రేమించగలిగి వుండాలి. ఇలా చేయాలనుకున్న మానవుడు జీవితంలోని ఏ రంగాన్నీ (రాజకీయ రంగంతో సహా) ఉపేక్షించజాలడు.

అహింస అనే పదాన్ని గాంధీజీ హింస లేకపోవడం అనే అర్థంలో కాదు వాడినది; దానికి ప్రేమించడం అని అర్థం చెప్పేవారు.

భక్తియోగాన్ని అవలంబించిన గాంధీజీ సత్యమే భగవంతుడని, సత్యాన్వేషణకు ఏకైకమార్గం ప్రేమేనన్న నిర్ణయానికి వచ్చారు. "అటువంటి ప్రేమ చక్రవర్తికివున్న శక్తికంటెకూడా గొప్పది" అని గాంధీజీ అన్నారు. సీజర్, అలెగ్జాండర్ వంటి విజేతలు, మహాసామ్రాజ్యాల నిర్మాతలు ప్రసరించిన ప్రభావంకంటె బుద్ధుడు, ఏసుక్రీస్తు, సెయింట్ ఫ్రాన్సిస్, చైతన్యుడు, రామకృష్ణపరమహంస, రమణమహర్షి, శ్రీ అరవిందుడు, గాంధీజీ వంటి మహాత్ములు ప్రసరించిన ప్రభావం గొప్పది.

అందరు ఆధ్యాత్మిక వాదులవలెనే భగవంతునిపట్ల గాంధీజీకి వున్న ప్రేమకు పునాది భగవంతునిపట్ల ఆయనకు వున్న అచంచల విశ్వాసమే: అదే పరశ్రద్ధ.

1944లో ఆగాఖాన్ ప్రాసాదంనుంచి గాంధీజీ విడుదలయినప్పుడు ఆయనను నేను సందర్శించాను. ఆ సంఘటన నాకు చిరస్మరణీయమైనది. అప్పటికి ఆయన ఆరోగ్యం చాలా దెబ్బతిన్నది. ఆయన మానసిక ప్రజ్ఞకూడా తగ్గినది. నన్ను చూచీ చూడగానే ఆయన అన్న మొదటిమాటలు: "మున్షీ ! ఎందువల్ల ఏపనికోసం భగవంతుడు నన్నిట్లా బ్రతికించి వుంచాడో తెలియడం లేదు." చాలా బలహీనమైన స్వరంతో ప్రార్థన చేస్తున్నట్టు గాంధీజీ అన్నమాట లవి. భగవంతుని దూతగా గాంధీజీ ఎలా జీవించారో అప్పుడు నేను గ్రహించాను.

ఢిల్లీలో ఆయన చేసిన ఆఖరి నిరాహార దీక్ష సందర్భంగా గాంధీజీ ఇలా అన్నారు:

"భగవంతుడే నా ఏకైక సలహాదారుడు. అందువల్ల ఇతరసలహాదారుల ప్రమేయంలేకుండా నేనొక నిర్ణయాన్ని గైకొనవలసియున్నది."

"నే నెవ్వర్ని ?" అని గాంధీజీ ప్రశ్నించుకొని ఇలా జవాబిచ్చారు: భగవంతుడిచ్చిన శక్తి మినహా నావద్ద మరే ఇతర శక్తి లేదు. శాంతిసాధన కాని - ఆ మాటకువస్తే మరే ఇతర అంశమైనా కాని అంతా భగవంతుని చేతుల్లో

వున్నది. భగవంతుని సంకల్పాన్ని మినహాయించి మరేమీ సంభవించదు."

ఏసు క్రీస్తులాగానే గాంధీజీ కూడా ఒక లక్ష్య సాధన కోసం ప్రాణత్యాగం చేశారు. "హే రామా" అంటూ ఆయన అసువులు బాశారు.

ఆధ్యాత్మిక అనుభూతులను నిర్ణయించడంలో కార్య కారణ సంబంధానికిచ్చిన ప్రాముఖ్యతను ఆయన అంగీకరించ లేదు. "మేధస్సును తృప్తిపరచేవాడు భగవంతుడేకాదు. హృదయాన్ని పరిపాలించి పరివర్తన తీసుకురాగల్గాలి భగవంతుడు. మనకు ఎంత వాస్తవికంగా కనుపించినప్పటికీ ఇంద్రియానుభూతులు మోసకారులు, అనర్థ హేతువులు. ఇంద్రియాతీతమైన జ్ఞానమే సిసలైనది."

"ఇంద్రియాలద్వారా భగవంతుణ్ణి అవగాహన చేసుకోవాలంటే మనము విఫలులమే కాగలము. ఎందుకంటే భగవంతుడు ఇంద్రియాతీతమైన జ్ఞానానికి మాత్రమే గోచరుడు. ఇంద్రియాతీతమైన సాధన ద్వారానే మనము భగవంతుణ్ణి దర్శించిన అనుభూతిని పొందగలము. మన అందరిలోనూ భగవంతుడున్నాడు. ఆయన విశ్వమోహన గీతి మన అంతరాంతరాల్లో గింగిర్లు తిరుగుతూనే వుంటుంది. ఈ ఆపాత మధుర సంగీతం మనకు వినపడకుండా మన ఇంద్రియానుభూతులు అవరోధిస్తూ వుంటాయి."

సత్యం, ప్రేమ భగవంతుడని గాంధీజీ ప్రబోధించారు. "నామట్టుకు నాకు భగవంతుడే సత్యం, ప్రేమ; నైతిక

వర్తనమే భగవంతుడు; నిర్భయత్వమే భగవంతుడు. భగవంతుడే జ్యోతి, జీవనం. వీటికి ఆయనే మూలకారణం అయి వుండికూడా వీటికి అతీతుడు. అంతరాత్మే భగవంతుడు" అని గాంధీజీ అన్నారు.

భగవంతునిపట్ల గాంధీజీకి వున్న ప్రేమ సాంద్రమైనది, పరిశుద్ధమైనది. అనేకమైన అత్యంతక్లిష్టమైన పరీక్షలను తట్టుకోవడానికి ఈ ప్రేమే ఆయనకు శక్తిని ప్రసాదించినది. భగవంతుని పట్ల మనకు ప్రేమ వున్నదనడానికి నిదర్శనం ఆయనకోసం సర్వస్వం త్యాగం చేయగల్గడమేనని గాంధీజీ అనేవారు.

అన్ని మతాల సారాంశము ఇదే. తోటి జీవులపట్ల, ఈ సృష్టి అంతటిపట్ల, భగవంతునిపట్ల భగవద్భక్తుడు ప్రేమ కల్గి వుండాలన్నదే ఈ సారాంశం.

భగవంతునిపట్ల భగవద్భక్తునికి వుండే ప్రేమ క్రింది విధంగా వుంటుందని రష్యన్ రచయిత దోస్తవస్కీ వర్ణించాడు: "భగవంతుడు చేసిన ఈ సృష్టినంతా ప్రేమించు. ఈ సృష్టిలోని ప్రతి ఇసుకరేణువును ప్రేమించు. ప్రతి ఆకును, కాంతికిరణాన్ని ప్రేమించు. జంతువుల్ని ప్రేమించు, చెట్లను ప్రేమించు. ప్రతిదానినీ నీవు ప్రేమిస్తే భగవంతుని చిద్విలాసము, సృష్టినంతా ఆవరించుకొనివున్న మాయ నీకు అవగాహన అవుతాయి. ఒకసారి నీకు ఇవి అవగాహనకు వచ్చాయో, ఈ మాయను నీవు రోజురోజుకూ మరింత బాగా అర్థం చేసుకుంటావు. సర్వాన్నీ ప్రేమించగలంతటి

విశాలహృదయంతో ఈ ప్రపంచాన్నంతటినీ ప్రేమించ గలుగుతావు.''

అటువంటి ప్రేమను భగవద్భక్తులు తమ వైయక్తిక జీవితంలో సాధించగలిగినప్పుడు ఇతరులలో అట్టి ప్రేమను, విశ్వాసాన్ని రగుల్కొల్పగలుగుతారు. ఇందువల్ల మతంపట్ల వారి దృక్పథం విశుద్ధమవుతుంది. ఈ అంశానికి మతపరమైన కార్యకలాపాలకు చాలా తేడావుంది. ఈ మతపరమైన కార్యకలాపాలు మానవాళికి చాలాసార్లు విధ్వంసాన్ని, అనర్థాన్ని తెచ్చిపెట్టాయని చరిత్ర ఋజువుచేస్తున్నది.

తన అనుచరులపట్ల ఇతడు విశేషమైన ప్రేమను కలిగి వుంటాడు. ఈ సమష్టి ప్రేమబంధం వలననే ఆయన ప్రధాన అనుయాయులు కలిసికట్టుగా వుంటారు. కొన్ని కొన్ని సందర్భాలలో జీవితంలోకంటె, మరణానంతరమే ఈ ప్రభావం అధికంగా వుంటుంది. ఇందుకు తార్కాణాలు బుద్ధుడు, ఏసుక్రీస్తు.

భగవద్భక్తుడు భవబంధాలనుంచి, క్రోధం, మదం, మాత్సర్యంనుంచి విముక్తి పొందవలసివుంటుంది.

క్రోధం మొదలైన ఉద్రేకాలు లేకుండా వుండడానికి ప్రార్థన అత్యవసరమని గాంధీజీ నొక్కి వక్కాణించేవారు. బహిరంగప్రదేశాలలో సామూహికంగా చేసే ప్రార్థనకైనా సరే, వైయక్తికంగా జేసే ప్రార్థనకయినాసరే ఇదే ప్రాధాన్యతను ఇచ్చేవారు గాంధీజీ.

తన ఆత్మకథలో ప్రార్థనపట్ల తన వైఖరిని గురించి గాంధీజీ ఇలా వర్ణిస్తారు:

"భగవంతుని శరణుపొందడం, ఆరాధన, ప్రార్థన ఇవి మూఢనమ్మకాలు కావు. తినడం, త్రాగడం, కూర్చోవడం, నిల్చుండడం ఇట్టి పనులకంటెకూడా అవి మరింత సహజమైనవి. భగవదారాధన, ప్రార్థన ఇవే నిజమైన కర్మలనడం అతిశయోక్తి కాబోదు. భగవదారాధన, ప్రార్థన హృదయం నుంచి ఉద్భవిస్తాయి. హృదయంలో ప్రేమతప్ప మరేమీ లేకుండా హృదయాన్ని పరిశుద్ధం చేసుకున్నప్పుడు, హృదయతంత్రులన్నింటినీ సమతూకంలో వుంచుకొన్నప్పుడు దివ్య సంగీతం వినిపిస్తుంది. ప్రార్థనకు మాట లక్కర్లేదు. క్రోధాది ఉద్రేకాలు లేకుండా హృదయాన్ని పరిశుద్ధం చేసుకోడానికి విఫలంకాని మార్గమేదన్నా వున్నదంటే అది ప్రార్థనే అని అనడంలో నాకెట్టి సందేహం లేదు. కాని, ప్రార్థనతో వినమ్రతను మేళవించాలి."

"భగవదారాధన అంటే భగవంతుణ్ణి కీర్తిస్తూ స్తోత్రాలు గానం చేయడమే. ఒక వ్యక్తి బలహీనతలనుంచి, తదితర చెడ్డ గుణాలనుంచి విముక్తి పొంది తన అల్పత్వాన్ని అంగీకరించడమే ప్రార్థన అంటే" అని గాంధీజీ అంటున్నారు.

భగవద్భక్తులకు ఏకాంతవాసం అవసరం. యోగి అనేవాడు "వివిక్తసేవి" (ఏకాంతవాసి) అయివుండాలి. గాంధీజీ జనసమూహాల మధ్య నివసించినప్పటికీ మౌనవ్రతం పాటించడంద్వారా ఏకాంతవాసం చేసేవారు.

"భగవత్ సాన్నిధ్యాన్ని పొందడానికి ఐచ్ఛికమైన ఏకాంతవాసం సూటిమార్గం. మస్తిష్కంనుంచి చేతన మనస్సు చేసే కార్యకలాపా లన్నింటినీ అరికట్టి భగవంతుని పట్ల ప్రేమతో దానిని నింపడంద్వారా శాశ్వతానందం చేకూరడమే కాక, అనశ్వరమైన శక్తితో ఆత్మ మమేకం పొందుతుంది" అని గాంధీజీ తన స్వీయానుభవాన్ని వివరిస్తూ అన్నారు.

ఏకాంతవాసంద్వారానే గొప్పగొప్ప ఆధ్యాత్మిక వాదులందరూ మానవాళి నాయకులు కాగలిగారు. చిట్ట చివరకు మానవాళిపై చాలా గొప్పదైన ఆధ్యాత్మిక ప్రభావాన్ని ప్రసరింపజేయగలిగారు. రమణమహర్షి వలె వీరు సృజనాత్మకమైన ప్రేమ, ఆధ్యాత్మిక వాదాలకు మచ్చుతునక లయినారు.

"ఓ ప్రభువా! మాట్లాడుమా! నీ సేవకుడు వింటున్నాడు" అని బైబిల్ అంటున్నది.

గాంధీజీ దృష్టిలో నిరాహారదీక్ష వహించడం బలవంతంపైన చేసే పనికాదు. భగవంతుని కృపను, దయను అర్థిస్తూ ఒక భక్తుడు భగవంతుణ్ణి ఉద్దేశించి ప్రార్థన చేయడంవంటిదే యీ దీక్షకూడ. అహింస ఆయుధాగారంలో నిరాహారదీక్ష ఆఖరి అస్త్రం. మానవత్వం లుప్తమై పోయినప్పుడు అహింసావలంబి నిరాహారదీక్ష వహిస్తాడు. నిరాహారదీక్ష ప్రార్థన మనస్తత్వాన్ని పెంపొందిస్తుంది. భగవంతుణ్ణి ఉద్దేశించి చేసిన ఆధ్యాత్మిక కర్మ నిరాహారదీక్ష.

నిరాహారదీక్ష అతి ప్రాచీనమైనదని, ఆత్మపారిశుద్ధ్యానికి ప్రప్రథమంగా ఉద్దేశించబడినట్టిదని గాంధీజీ అన్నారు. భగవంతుణ్ణి ముఖాముఖి సందర్శించే నిమిత్తం ఏసుక్రీస్తు, మహామ్మదు ప్రవక్తలు నిరాహారదీక్ష వహించారు. తన సైన్యం లంక చేరుకోవడానికి సముద్రం మార్గం ఇవ్వాలని కోరుతూ శ్రీరాముడు నిరాహారదీక్ష వహించాడు. పరమ శివుడు తన పతి కావాలని కోరుతూ పార్వతి నిరాహారదీక్ష వహించినది.

"నా చుట్టూ వున్న ప్రతిదీ నిరంతరం మార్పుచెందుతున్నది, నశ్వరమై పోతున్నది. కాని ఈ మార్పు అంతటిలోను సృష్టిస్తూ, నశింపచేస్తూ, పునః సృష్టి చేస్తున్న సజీవమైన శక్తి ఒకటున్నది. ఆ శక్తే భగవంతుడు. ఇంద్రియాల ద్వారా నేను చూచేది శాశ్వతంగా వుండేది కాదుగనక భగవంతుడే శాశ్వతంగావుండేవాడు." అని గాంధీజీ అన్నారు.

మానవ స్వభావంలో పరివర్తనం తీసుకురావడానికి భగవంతునికున్న శక్తిని గాంధీజీ ఇలా అభివర్ణించారు.

"తమలో తామే భగవత్ సాక్షాత్కారాన్ని సాధించినవారు పరివర్తన పొందినట్లు. ప్రతి దేశంలోనూ ప్రతి కాలంలోనూ అవిచ్ఛిన్నంగా వుంటూ వస్తున్న ప్రవక్తలు, యోగులు, మహర్షులు ఇందుకు తార్కాణాలు. ఈ అంశం నిజమైనది కాదని అనడం మన ఉనికిని మనం నిరసించుకోవడమే కాగలదు" అని గాంధీజీ వివరించారు.

# 2

## ఉపదేశకుడుగా గాంధీజీ

దేశభక్తులు గాంధీజీని "జాతిపిత" అని పిలువవచ్చు. చరిత్రకారులు ఆయనను "భారతదేశానికి బానిసత్వాన్నుంచి విముక్తికల్పించినవ్యక్తి" అని అనవచ్చు. ఏది ఏమైనప్పటికీ, అనాగరికతనుంచి మానవాళిని ఉత్తమస్థితికి తీసుకొనివెళ్ళే నైతిక, ఆధ్యాత్మిక విలువలకోసం పోరాడిన గొప్ప దేవమాతలలో ఒకరుగా ఆయనను పరిగణింపవచ్చును.

తరతరాలలో లేదా నాగరికతలను పురస్కరించుకొని, మారిపోవుచుండు ప్రవర్తనా నియమావళి ఆయననంతగా ఆకర్షించలేదు. ప్రవక్తలు ప్రవచించిన, కవులు కీర్తించిన తిరుగులేని నైతికవర్తనకే ఆయన ప్రాముఖ్యత ఇచ్చారు.

భగవంతుణ్ణి, నైతికవిలువలను అపహాస్యంచేసే నేటి కాలంలో ఆయన జీవించి పనిచేసినందున, ఆయన సాధించిన విజయాలు మరింత గణనీయమవుతున్నాయి.

భౌతిక ప్రపంచానికనువర్తించే విధానాలు మానవుని కోరికలను సాధించుట కక్కరకురాకున్నను, గత శతాబ్దంలో రూపొందించబడి అమలులోకి వచ్చిన వైజ్ఞానిక సిద్ధాంతాలనేవి నైతికవర్తనపట్ల మానవునికి వున్న విశ్వాసాలనేగాక ఆత్మ విశ్వాసమును కూడ చాలవరకు భగ్నం చేసినవి. ఉదాహరణకు నైతికవిషయంలో ఉపయోగితా సిద్ధాంతం

జనబాహుళ్య సూత్రాన్ననుసరిస్తున్నది. తర్కమే మానవుల నందరను నడపు దివ్యమార్గమని వీరి యూహ. అంటే, సామూహికమైన స్వార్థానికిది దివ్యత్వము నాపాదించు చున్నది. అధికారపిచ్చిగల మతాలవారు జనసందోహాలను పోలింగ్ కేంద్రాలకు తరలించి వోట్లుసంపాదించుట కిదియొక స్వేచ్ఛాపత్రమైనది. ఇందు స్వార్థమేతప్ప పరార్థము మృగ్యమైనది.

పరిణామవాదాన్ని రూపొందించిన డార్విన్, భౌతిక సూత్రాలను నైతికవర్తనకు అనువర్తింపచేయడానికి ప్రయత్నించాడు. "పరిస్థితులకు తట్టుకోగల జీవిమాత్రమే మిగులుతుంది" అన్న సూత్రాన్ని ఈయన పరీక్షకు పెట్టాడు.

ఆధునిక నియంతృత్వ సిద్ధాంతాలకు మూలపురుషుడైన హెగెల్, వ్యష్టినైతికవర్తన దేశంఅవసరాలకు అనుగుణ్యంగా వుండాలని బోధించాడు. దీనివలన నైతికవర్తనకు ద్వితీయస్థానం మాత్రం ఇచ్చినట్టయినది.

దీనిద్వారా సోవియట్ రష్యా తరహా సిద్ధాంతం బయలుదేరినది. దీనిప్రకారం సత్యం (ఒక్కటే) పరమావధి కాదు. సంపూర్ణమైనట్టిది కాదు. "మన నైతికవర్తన, ప్రవర్తన వర్గపోరాటానికి అనుగుణ్యంగా, అనుబంధంగావుండాలి" అని లెనిన్ అన్నారు. కమ్యూనిజం లక్ష్యాలను సాధించడానికి ఏది అవసరమో దానినే చేయాలని దీని అంతరార్థం. ఈ అవసరమైన వాటిని నిర్ణయించేది కమ్యూనిస్టుపార్టీ. నేడు నీతి అన్నది రేపు అవినీతి కావచ్చు. నేడు అవినీతి అన్నది రేపు నీతి కావచ్చు.

నైతిక వర్తనకు గాంధీజీ అత్యధికమైన ప్రాధాన్యత ఇచ్చారు. ఈ విషయంలో ఆయన రాజీ పడలేదు, ఎట్టి మినహాయింపులూ ఇవ్వలేదు. ఈ నైతిక విలువలను ఆయన తన వైయక్తిక జీవితంలో సాధనచేయడమే ఆయనగ్రకొన్న మొట్టమొదటి చర్య. అహింసను, సత్యాన్ని కాక క్రమేణా ఆయన అస్తేయాన్ని (తస్కరించకుండా వుండడం), బ్రహ్మచర్యాన్ని, అపరిగ్రహాన్ని బోధించడం ప్రారంభించారు. యోగాన్ని అభ్యసించే వ్యక్తిపై "మహావ్రతాల" ను దేశ కాలాలతో ప్రమేయం లేకుండా ఆచరించవలసి వుంటుందని "యోగసూత్రా"లలో పాతంజలి పేర్కొన్నాడు.

ఈ నైతికసూత్రం విశ్వజనీనమైనదని, అనుల్లంఘనీయమైనదని గాంధీజీ అంటున్నారు. ఈ సూత్రానికి అనుగుణ్యంగా సత్యదర్శనం జరిగితే చిరకాలం వుండే ఫలితాలు దక్కుతాయి. అహింసను సాధిస్తే ప్రేమ, బ్రహ్మచర్యం వలన శక్తి, సంపూర్ణమైన నిజాయితీవలన సంపద, అపరిగ్రహం, విశుద్ధమైన వైయక్తికజీవితం సిద్ధిస్తాయి. ఇది తప్ప మరొక మార్గం లేదు. ఈ సూత్రాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తే మానవుడు అతని జీవితం, పరిసర పరిస్థితులు ఈ జీవితంలోనే కాక భవిష్యత్తులో కూడా మేలుగా వుండేలా మార్పు చెందుతాయి. దీనివలన సర్వోదయం సిద్ధిస్తుంది.

ఈ సూత్రాలకు గాంధీజీ చెప్పిన భాష్యం ఆయన ప్రార్థనా సమావేశాలలో రోజూ గానం చేసే శ్లోకాలలో పొందు పరచబడినది.

సత్యం, అహింస, అస్తేయం (తస్కరించకుండా వుండడం), అసంగ్రహం, అస్వాదు, బ్రహ్మచర్యం (పరిమిత కామం), శరీరశ్రమ, స్వదేశీ (తన నివాసానికి దగ్గరగావున్న ప్రదేశాలలోని వస్తువులనే వాడడం), స్పర్శభావన (అస్పృశ్యతను నిర్మూలించడం), సమభావం, అభయం (నిర్భయత్వం) - వీటిని ఈ ప్రార్థన శ్లోకాలు బోధిస్తున్నాయి.

భౌతికశక్తులకు లొంగివుండే ప్రాణి మానవుడు అన్న భావాన్ని గాంధీజీ అంగీకరించలేదు. మానవుడు పరిస్థితుల బానిస అన్న కొంతమంది భావాన్నికూడా ఆయన త్రోసి రాజన్నారు. అనేక జీవితాలనుంచి అవిచ్ఛిన్నంగా వస్తున్న ఆనువంశికమైన, పరిసర ప్రభావంకల్గిన, నైతికమైన, ఆధ్యాత్మికమైన శక్తుల కూడలి మానవుడు అన్న భావంతో గాంధీజీ వుండేవారు.

పైన పేర్కొన్న మహావ్రతాలను వైయక్తిక జీవితంలో ఆచరించ ప్రయత్నించడానికి మానవుడు చేసే నిరంతర కృషి నైతిక శక్తివలననే సిద్ధిస్తుంది.

ఈ నైతిక శక్తివలననే మానవుడు మృగదశను తప్పించుకొని దేవుడు అవుతున్నాడు.

వర్తమానంలోని తన జీవితాన్నే కాక, భవిష్యత్తులో వుండే ఇతర జన్మలనుకూడ బాగుచేసుకొనడానికి, సాంఘిక, ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచుకోవడానికి ఈ సృజనాత్మక శక్తిని మానవుడు వినియోగించుకోవచ్చును.

ఒక సాధారణ మానవుడినుంచి గాంధీజీ ప్రవక్తగా ఎలా రూపొందినదీ గాంధీ ఆత్మకథ చదివితే మనకు బోధ పడగలదు. ఈ ఔన్నత్యాన్ని చేరుకోవడానికి ఆయన చేసిన ప్రయత్నాల వివరణయే ఆయన ఆత్మకథ.

చాలా చిన్నప్పటినుంచీ గాంధీజీ ఒక క్రమశిక్షణను పాటించారు. మాంసాహారాన్ని, పొగత్రాగడాన్ని మాను కొన్నారు. ఖరీదైన బట్టలను ధరించేవారు కాదు. స్వంత ఆస్తిని విడనాడుకొన్నారు. వివాహితుడైనప్పటికీ 37 వ ఏటనే కామోపభోగాల్ని త్యజించి బ్రహ్మచర్యం అవలంబించారు. స్వార్థం, అహంభావం వలన కలిగే క్రోధం, ద్వేషం, పగ ఇలాంటి గుణాలన్నింటినీ అదుపులోకి తెచ్చుకోగలిగారు. నైతికమైన, ఆధ్యాత్మికమైన ఆయన పురోభివృద్ధి సమానాంతరంగా జరిగాయి.

సత్యాన్వేషణకు, సత్యాన్ని దర్శించడానికి ఆమరణ పర్యంతం గాంధీజీ ఇట్టి కృషి చేస్తూనే వున్నారు.

మనసా వాచా కర్మణా సత్యాన్వేషణకు చేసిన ఒక బృహత్తరమైన ప్రయోగమే గాంధీజీ జీవితం. "మనస్యేకం, వచస్యేకం, కర్మస్యేకం మహాత్మనం" అనేది కాపీ బుక్కులో వుండే సూత్రం కాదు. అహరహం కృషిచేయడం ద్వారా ఆచరించదగిన నియమావళి. గాంధీజీ సాధించిన అద్భుతవిజయాలు ఆయన చేసిన ఈ బృహత్తరమైన కృషిని పాక్షికంగా మాత్రమే దర్శించడానికి ఉదాహరణలు.

సత్యంలో ఎంత నైతికశక్తివున్నదో గాంధీజీ కనుగొన్నరీతిని వర్ణించడం చాలా ఆసక్తిదాయకంగా వుంటుంది.

బాల్యావస్థలో గాంధీజీ "శ్రవణునిపితృభక్తి" నాటకాన్ని చదివారు. ఈ నాటక ప్రదర్శనను కూడా చూచారు. ఈ నాటకం గాంధీ మనస్సుపై విపరీత ప్రభావం ప్రసరింప చేసింది. శ్రవణుని వర్తనను ఆదర్శంగా పెట్టుకోవాలని గాంధీ నిశ్చయించుకొన్నారు.

హరిశ్చంద్ర నాటకాన్ని కూడా గాంధీ చూచారు.

"ఈ నాటకం ప్రభావం నాపైన ఎంతో వున్నది. అనేకసార్లు నేను హరిశ్చంద్రుడిలాగా నటించివుంటాను. హరిశ్చంద్రుడిలాగా అందరూ సత్యమే ఎందుకు పలకకూడదు అని నాలో నేనే ప్రశ్నించుకునేవాణ్ణి." అని గాంధీజీ తమ ఆత్మకథలో వ్రాసుకున్నారు. ఈ అంశమే ఆయనను సత్యాన్వేషణకు పురికొల్పింది.

ఈ దిశగా ఆయన చేసిన కృషి, ప్రయత్నాలు చూస్తే మానవ బలహీనతలు మొదట్లో ఆయనలో ఎక్కువగానే వున్నట్లు స్పష్టం కాగలదు. బాల్యావస్థలో ఆయన మాంసం తిన్నారు, బీడీ కాల్చారు, సిగరెట్లు కొనడానికి సోదరుని వద్ద నుంచి డబ్బు దొంగిలించారు. ఆయన ఒక సానికొంపకు వెళ్ళారు. కాని, లజ్జతో అక్కడినుంచి పారిపోయారు. భార్యతో అధికంగానే ఆయన దాంపత్యజీవితం నెరపారు. తన ఈ తప్పిదాలను చూచి ఆయన ఎంతో మదనపడి, తగు రీతిగా శిక్షించవలసిందిగా కోరుతూ తన తండ్రికి గాంధీజీ ఒక లేఖకూడా వ్రాశారు.

తన తప్పిదాలను ఒప్పుకుంటూ గాంధీజీ వ్రాసినలేఖను ఆయన తండ్రి (అప్పటికి ఆయన చాలా అస్వస్థులుగా వున్నారు) చదివి దుఃఖంతో కన్నీళ్ళు కార్చారు. వెంటనే ఆ లేఖను ఆయన చింపివేశారు.

"నేనుకూడా దుఃఖించాను. నా తండ్రిగారు దుఃఖంతో వేదనతో కార్చిన కన్నీళ్ళు నా హృదయాన్ని పరిశుద్ధం చేశాయి. నా పాపాల్ని కడిగివేశాయి. అటువంటి ప్రేమానుభూతిని పొందినవారే దానిని వర్ణించగలరు. అహింసలో ఇది నాకొక గుణపాఠం. అట్టి అహింసను సర్వవ్యాపిత మైనప్పుడు అది స్పృశించిన ప్రతివస్తువు పరివర్తనం పొంది తీరుతుంది. దానిశక్తికి పరిమితి అన్నదే లేదు". అని గాంధీజీ తమ ఆత్మకథలో వ్రాసుకున్నారు.

భగవద్గీతను పారాయణచేయడం, తులసీదాసు రామాయణంలోని శ్లోకాలను పఠించడం, "వైష్ణవజనతో" ప్రార్థనాగీతాన్ని నిరంతరం పఠించడం - వీటివల్ల నైతిక వర్తన అన్నివిషయాలకు మూలకందంగా వుండాలని నైతిక వర్తనకు సారం సత్యమని గాంధీజీ భావించేవారు.

తన ఆత్మకథలో బ్రహ్మచర్యం (కామాన్ని జయించడం) గురించి గాంధీజీ విపులంగా వ్రాశారు. "అటువంటి బ్రహ్మచారికి ఈ విశాలప్రపంచం అంతా ఒక పెద్ద కుటుంబంగా కనుపిస్తుంది. మానవాళిని వేధిస్తున్న చింతను పోగొట్టడానికి తన శక్తియుక్తులను వినియోగిస్తాడు". అని గాంధీజీ వ్రాశారు.

కఠినమైన యోగి జీవితాన్ని గడపడంగురించి గాంధీజీతో శ్రీ అరవిందుడు పూర్తిగా ఏకీభవించలేదు. శ్రీ అరవిందుడు ప్రవచించిన "సమన్వయపూర్వకమైన యోగం" దేహాన్ని కఠిన నియమాలతో హింసించమని శాసించడం లేదు, వాసనాజాతమైన కోర్కెలను అణగద్రొక్కమని చెప్పడంలేదు. మితంగా పరిశుద్ధమైన ఆహారాన్ని సేవించడం, పరిమితంగా నిరశనవ్రతం అవలంబించడం వీటిని శ్రీ అరవిందుడు బోధించాడు. భగవత్సాక్షాత్కారాన్ని వాంఛించే ముముక్షువులు కామానికి సంబంధించినంత వరకు సంపూర్ణమైన పవిత్రతను కలిగివుండాలని ఆయన బోధించారు.

కామాన్ని అదుపుచేసి పరివర్తింపచేస్తే, నైతికమైన, ఆధ్యాత్మికమైన శక్తిని సంపాదించవచ్చునన్న మహర్షుల, యోగుల ప్రవచనములో సత్యం ఎంతవరకున్నదో తేల్చుకోవడానికి గాంధీజీ ఆమరణపర్యంతం ప్రయోగాలుచేస్తూనే వుండినారు.

ఈ ప్రయోగాలను చేస్తున్నప్పటికీ మహిళలపట్ల గాంధీజీ ఎప్పుడూ కఠినమైన వర్తనను అవలంబించలేదు. స్త్రీలపట్ల ఆయన ఎంతో మర్యాదపురస్సరంగా సానుభూతితో ప్రవర్తించేవారు. వివిధవయస్సులలోవున్న మహిళలతో సంభాషించడం, వారి కష్టనిష్ఠూరాలను అవగాహన చేసుకోవడానికి యత్నించడం, వారితో వాహ్యాళికి వెళ్లడం గాంధీజీ దినచర్యలో భాగంగావుండేది.

చాలా వృద్ధాప్యంలోకూడా ప్రేమతో తుల్యమైన ఆరాధనను ఆయన స్త్రీలలో కలిగించడం నే నెరుగుదును. కొంతమంది యువతులైన భక్తురాళ్ళను తనపాదాలు ఒత్తడానికి ఆయన అనుమతించేవారు. అనుబంధ సూచనగా తనను ఆలింగనం చేసుకోవడానికి అంగీకరించారు. అయితే, కొన్నికొన్ని సందర్భాలలో ఈ ప్రయోగాన్ని ఇతరులు అపార్థంచేసుకోవడం జరిగేది. కామాన్ని అదుపుచేసి సన్మార్గాలలో ప్రవహింపచేయడంద్వారా కలిగే అపారమైనశక్తిని గురించి ఇంతకాలం ఆయన అంచనా వేస్తూనే వున్నారు.

గాంధీజీ, ఆశ్రమంలో అన్ని వయస్సులలోని పురుషులు, స్త్రీలు బాహాటంగా కలసిమెలసి పనిచేస్తూ వుండేవారు. కాని మానవస్వభావం పోతుందా? ఆశ్రమంలోని పిన్న వయస్కుల కామసంబంధాలు వెలుగులోకివచ్చి సమస్యగా తయారయ్యేవి. మానవ స్వభావం గురించిన సదవగాహనతో ఆయన ఈ సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించేవారు.

ఒకసారి ఏం జరిగిందంటే – "ఎక్స్" అనేవ్యక్తి గాంధీజీ కార్యక్రమాలలోని ప్రముఖమైన కార్యకలాపాలను నిర్వహిస్తూవుండేవాడు. గాంధీజీ అడుగుజాడలలో నడిచే సిసలైన అనుచరుడు. ప్రజల ప్రేమాభిమానాలను చూరగొన్నట్టివాడు. ఒక అవివాహితయువతికి బోధిస్తూ ఆమెతో కామసంబంధాలు ఏర్పరచుకున్నాడు. గాంధీజీకి ఈ విషయం తెలిసి "ఎక్స్"ని పిలిచి అడిగారు. "ఎక్స్" అటువంటిదేమీ లేదని అబద్ధమాడాడు.

గాంధీజీ ఈ విషయమై ఇంకా ఆరాలుతీసి "ఎక్స్"

చెప్పినది అబద్ధమని తేల్చుకొన్నారు. బహిరంగంగా ఈ తప్పిదంగురించి చెప్పివేశారు. "ఎక్స్"ను అతడి కార్యకలాపాలనుంచి తొలగించి సేవాగ్రాం చేర్చారు.

ఈ సంఘటనను గురించి గాంధీజీ నాతో చెబుతూ ఇలా అన్నారు: "అతడిని సన్మార్గంలో పెట్టడానికి అదొక్కటే పద్ధతి అనుకో. గర్భవతిఅయిన ఆ యువతిని ఒక దూరప్రదేశానికి పంపించాను. ఆమె ప్రసవానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి." తర్వాత మందస్మితంచేసి "అది ప్రేమ ముడి అనుకో. ఒకకత్తితో ఆ ముడిని రెండుగా నేను తెగగొట్టలేకపోయాను." అని గాంధీజీ అన్నారు.

ఈ సంఘటనను నెమరువేసుకుంటే మేరీ మాడలైన్ పట్ల ఏసుక్రీస్తు వహించిన వైఖరి నాకు గుర్తుకు వస్తున్నది.

గాంధీజీ తన స్వీయజీవితంలో అస్తేయం (దొంగతనం చేయకుండా వుండడం), అపరిగ్రహం (ఆస్తినికలిగి వుండకపోవడం) ఈ రెండింటినీ సాధించారు. ఆశ్రమానికి వచ్చే ధనంపట్ల ఆయన ఎంతో శ్రద్ధ వహించేవారు. జమాఖర్చులు ఖచ్చితంగా వుండాలనేవారు. ఎంత చిన్న తేడా వచ్చినా, అది ఎంత చిన్న మొత్తమైనప్పటికీ, అవతలి వ్యక్తి ఎంత పలుకుబడి గలవాడయినప్పటికీ, ఆయన సహించేవారుకాదు.

అప్రతిష్ఠలని ఆలోచించకుండా హిమాలయమంతటి తన తప్పిదాలను అంగీకరించే ధైర్యసాహసాలు ఆయనకుండేవి. అన్నివిషయాలలోకి మహోన్నతమైన అభయము (నిర్భయత్వం)ను ఆయన పెంపొందించుకొన్నారు. అభయం

అంటే దైహికమైన భయం లేకపోవడమే కాదు; మనస్సు నుంచి భయం అనే భావాన్ని పారద్రోలాలి. భగవంతుడి పట్ల అచంచల విశ్వాసం వుంచి ఆయనకు ఆత్మార్పణ చేసు కుంటేనేతప్ప ఇది సాధ్యంకాదు.

వివిధకర్మలద్వారా భగవంతుడిని గాంధీజ్ సేవిం చారు. "నా భగవంతుడు బహుముఖస్వరూపి. జాతి ఐక్య తలో ఒకసారి, అస్పృశ్యతానివారణలో ఒకసారి నేను భగ వంతుడిని దర్శిస్తాను. ఈరీతిగా ఆయనతో నేను సామీప్యతను పొందుతాను."

ఆయన ఏంచేసినా ఆ పనికి ఆధ్యాత్మిక విలువలను ఇచ్చేవారు. కొంతకాలం రచనావ్యాసంగం చేసినతర్వాత అది తనకు భౌతికమైన, ఆధ్యాత్మికమైన అవసరంగా పరిణ మించినట్టు ఆయన గుర్తించారు.

సత్యం అనే పదానికి విపులమైన అర్థం వున్నది. సత్యవాక్కు, సత్యప్రతిజ్ఞ అంటే సత్యమునే పలుకుట, సత్య మునకే కట్టుబడివుంటానని ప్రతిజ్ఞచేయడం మాత్రమేకాదు. ఒకసారి ఒకమాట అంటే జీవితం పోయినాసరే దానిని నెర వేర్చడమే సత్యప్రతిజ్ఞ అంటే.

సత్యాన్నిగురించిన ఈ సిద్ధాంతానికి ఈ క్రిందివి అవసరం:

మొదటిది – శాశ్వతమైన సృజనాత్మక కార్యకలాపా లకు వైయక్తిక జీవితంలో సత్యసాధన మూలకారణం కావాలి.

రెండవది - సత్యాన్ని మనసా వాచా కర్మణా అనుసరించదలచుకొన్నవారు ప్రాణత్యాగానికైనా వెనుదీయరాదు.

ఇట్టి సత్యాన్ని గాంధీజీ ఉపదేశించారు.

సత్యాన్ని ఆ దృష్టితో చూస్తే మానవుని ఔన్నత్యాన్ని చాటేదిగా అర్థం అవుతుంది. జీవితవికాసాని కడ్డుపడే కఠిన నిబంధనలపైనను, సాంఘికమైన, రాజకీయమైన, మతపరమైన మూఢసిద్ధాంతాలపైనను ప్రపంచంలో కొన్ని దేశములలో ప్రభుత్వములు తలపెట్టిన నిరంకుశ పథకముల మీద యిది తిరుగుబాటు.

సత్యంతోపాటు అహింసనుకూడా మేళవించాలన్నది గాంధీజీ అభిప్రాయం. సత్యం, అహింస ఈ రెండింటి మేళవింపే గాంధీజీ ఉపయోగించిన సత్యాగ్రహం.

అనర్థాన్ని నిరోధించడానికి ఒక ఆయుధంగా సత్యాగ్రహాన్ని ఉపయోగించడంలో కొన్ని యిబ్బందులు వున్నాయి. సత్యాగ్రహాన్ని చేసే అట్టి వ్యక్తి ఈ అస్త్రాన్ని తప్పుచేసిన వాడిపైన కాక, తప్పిదముమీదనే సంధించాలి. ఎంతో నిరంతరాయమైన పారిశుద్ధ్య సాధన వుంటేకాని ఇది సాధ్యంకాదు.

అదే సమయంలో తాను కష్టసహిష్ణుతను అలవర్చుకోవాలి. అవతలిపక్షంవారు హింసకు గురి కారాదు. తాను ధర్మం అనుకొన్న ఒక పనికోసం తనంత తానుగా ఇలా కష్టాలకు గురికావడంవల్ల సత్యాగ్రహి హృదయంలో ద్వేష

భావం వుండదు. అది శత్రువు హృదయంనుంచి కూడ ద్వేషభావాన్ని పోగొడుతుంది.

అనర్థాన్ని ఎంత తీవ్రంగా హింసకు పాల్పడకుండా వ్యతిరేకించగల్గుతామో, దానిపైన సత్యాగ్రహం విజయం ఆధారపడియున్నది. ఈ సత్యాగ్రహం హింసను మట్టుపెట్ట డమేకాక జీవితంలోని అన్ని కష్టాలను నవ్వుముఖంతో ఎదు ర్కొనేటట్టు సత్యాగ్రహిని రూపొందిస్తుంది. ఆవిధంగా బల ప్రయోగంతోకూడిన దురాక్రమణ నుంచి ఆత్మశక్తితో నిరోధించడానికి ప్రాధాన్యతను తరలించడమయినది.

పై అంశాలతో కూడినప్పుడే అహింసా విధాన పూరితమైన సత్యాగ్రహం అనేది మనచేతుల్లో అమేయమైన శక్తిగలట్టి ఆయుధం కాగలదు. ఫలితాలు దశలవారీగా నెమ్మదిగా చేకూరుతాయి. కాని, దీని పర్యవసానంగా ఏర్పడే వైషమ్యప్రభావం చిరకాలం వుండదు.

సత్యాగ్రహం అనేది అతి పవిత్రమైన ఆకాంక్ష, ద్వేషరహితమైన విశ్వాసం. నైతికవర్తన ఆధిక్యతను దాట డానికి చేసుకొన్న గట్టి సంకల్పం ఫలితంగా జరిగే కార్య కలాపమే సత్యాగ్రహం. ప్రమాదకర పరిస్థితిలో సత్యా గ్రహి వీరోచితమైన ప్రవర్తనను ప్రదర్శించవలసి వుంటుంది.

వినమ్రభావంతో ప్రాణంపోయినాసరేఅనే ధైర్యంతో సత్యాన్ని అనుసరించగల శక్తి సత్యాగ్రహి కున్నప్పుడే సత్యాగ్రహం విజయవంతమవుతుంది. తాను పోరాడుతున్న

ఉద్యమం ధర్మమైనదనే విశ్వాసం సత్యాగ్రహికి కలిగినప్పుడే ఇది సాధ్యం. ఈ అంశాన్ని గాంధీజీ నొక్కి చెప్పేవారు.

"సత్యాగ్రహం అంటే ప్రేమ, ప్రేమసూత్రం. దీనిని మీరు ఆకర్షణ అనండి, సమన్వయీకరణ అనండి, ఏదైనా అనండి. ఇదే ప్రపంచాన్ని పరిపాలిస్తుంది. మృత్యుముఖంలో కూడా జీవనం వున్నది. విధ్వంసంఅనేది నిరంతరం జరుగుతూ వున్నా ఈ విశ్వం మనుగడ సాగిస్తూనేవున్నది. అసత్యంపైన సత్యం విజయం సాధిస్తుంది. ద్వేషాన్ని ప్రేమ జయిస్తుంది. సైతాన్‌పై భగవంతుడు విజయాన్ని సాధిస్తాడు. సత్యాగ్రహికి తన స్వంతమనే శక్తి ఏదీలేదు. అతడికున్న శక్తి అల్లా అతడికి భగవంతుడినుంచి వచ్చినదే."

"సత్యాగ్రహికి భగవంతుడిలో సజీవమైన విశ్వాసం వుండాలి, ఎందుకంటే, సత్యాగ్రహికి భగవంతునిపట్ల అచంచల విశ్వాసం తప్ప మరే ఇతర శక్తీ లేదు." అని గాంధీజీ అంటున్నారు.

"నే నెవ్వరిని ?" అని గాంధీజీ ప్రశ్నించుకొని ఇలా జవాబిచ్చారు : "నాకు భగవంతుడిచ్చిన శక్తితప్ప వేరే ఇతర శక్తి ఏమీ లేదు. నా దేశప్రజలపై నైతికమైనదికాక మరెట్టి అధికారమూ నాకులేదు. హింస స్వైరవిహారం చేస్తున్న నేటి ప్రపంచంలో అహింసను బోధించడానికి భగవంతుడు నన్నొక ఉపకరణంగా భావిస్తే ఆయనే నాకు శక్తిని ప్రసాదిస్తాడు, మార్గం చూపెడతాడు. నావద్దవున్న ఆయుధం ప్రార్థన. అందువల్ల శాంతిసాధన అనేది భగవంతునిచేతుల్లో వున్నది. భగవంతుని సంకల్పం లేనిదే ఏమీ జరగదు."

చరిత్రలో వివిధకాలాలలో ఏదో ఒక రూపంలో అహింసావిధానపూరితమైన విముక్తి ఉద్యమాలు జరిగాయి. బ్రిటిషరు పరిపాలన వచ్చిన ఆదికాలంలో జరిగిన ఇట్టి విముక్తి ఉద్యమాలను గురించి "స్వాతంత్ర్యావతరణ" అనే పుస్తకంలో డాక్టర్ అశోక్ మజుందార్ వివరించివున్నారు.

కాని, ఈ పద్ధతిని విశుద్ధం, శక్తిమంతం చేసినది గాంధీజీ మాత్రమే.

# 3

## ప్రవక్తగా గాంధీజీ

భగవద్భక్తుల విశ్వాసం ఎంత అచంచలమైన దైనప్పటికీ, సంస్కరణవాదుల బోధనలు ఎంత ఉదాత్తమైనవైనప్పటికీ; మానవాళిని, సమాజాన్ని మార్చే ఆధ్యాత్మికశక్తిని వారు ప్రవహింపచేయలేదు. ఈ పరివర్తన తెచ్చే శక్తి వారికి కలగాలంటే వారి విశ్వాసము, బోధనలు చైతన్యవంతమైన వ్యక్తిత్వం ద్వారా ప్రసరించాలి. అట్టిసందర్భంలోఅట్టి వ్యక్తి భగవద్భక్తుడూ కాడు, సంస్కారవాదీ కాడు. ప్రవక్త అవుతున్నాడు.

హింస, అన్యాయం, నేరం, స్వార్థం వీటిస్థానే సత్యం, ప్రేమ, సౌందర్యం వుండే ఒకవినూత్న ప్రపంచాన్ని చూపెట్టి, అట్టి ప్రపంచ నిర్మాణానికి క్రమశిక్షణతోకూడిన పద్ధతులను నిర్దేశించడంద్వారా ప్రవక్త అట్టి మహత్తరమైన ఆధ్యాత్మిక శక్తిని ప్రసరింపచేస్తున్నాడు.

బైబిల్ కాలంనాటి ప్రవక్తలు, యూదులకు ఇట్టి ఒక ప్రపంచాన్ని మెస్సయ్య నిర్మించనున్నాడని చెప్పడమే, తరతరాలుగా యూదులు అనేకమైన త్యాగాలు చేయడానికి కారణం. ఈనాడుకూడా ఇజ్రాయెల్ విపత్కర పరిస్థితులను వీరోచితంగా ఎదుర్కొనడానికి ఈ విశ్వాసమే కారణం.

లోభం, ఆధిక్యతాభావం, గర్వం, ద్వేషం అలముకొన్న ఈ ప్రపంచంలో "భగవత్సామ్రాజ్యం" అవతరించ

నున్నదని చెప్పకపోతే, మహిమాన్వితమైన వ్యక్తిత్వం లేక పోయినట్లయితే ఏసుక్రీస్తు శతాబ్దాల తరబడి మానవాళిని ఇంతగా ప్రభావితం చేయలేకపోయేవాడు.

"మానవాళి మతాలు" అన్న గ్రంథంలో చైతన్యవంతమైన ఏసుక్రీస్తు వ్యక్తిత్వంగురించి హూస్టన్‌స్మిత్ ఇలావివరించాడు: "ఈ యూదు వడ్రంగి ఒక పశువులశాలలో జన్మించాడు. 33 ఏళ్ళ వయస్సులో ఒక వీరుడుగా గాక ఒక నేరస్థునివలె మరణించాడు. తన జన్మస్థానంనుంచి 90 మైళ్ళు దాటి ఎప్పుడూ ప్రయాణం చేయలేదు. స్వంత ఆస్తి అనేది లేదు. ఏ పాఠశాలలోను విద్యాభ్యాసం చేయలేదు. సైన్యాధికారా? కాదు. పుస్తకాలేమీ వ్రాయలేదు. అయినప్పటికీ ఈ క్రీస్తుజయంతిని, వర్ధంతిని ప్రపంచం అంతటా జరుపు కొంటున్నారు. అయితే ఈయన ఎవ్వరు?"

గాంధీజీ వ్యక్తిత్వంలోను, గుణవిశేషాలలోను వున్న అద్భుతావహమైన అంశం ఎంత శక్తిమంతమైనదో ఆయన మాటలుకూడా అంత శక్తిమంతమైనవి. 1935లో నేను గాంధీజీని సందర్శించినప్పుడు గాంధీజీ వ్యక్తిత్వ చిత్రణను నేను ఇలా చేశాను:

"నేను ఆయనను చూచినప్పుడల్లా ఆయనచుట్టూవున్న ప్రపంచం మందస్మితాలతో కాంతివంతమవడం, నాపట్ల సదవగాహనంతో అపేక్షతో చూసే ఆయన నయనద్వయం మాత్రమే నాకు గోచరిస్తాయి. నన్ను ముగ్ధుణ్ణిచేసే ఆయనకంఠ

స్వరమే నాకు వినిపిస్తుంది. అమరమైన యౌవనానికిచిహ్నంలా అన్నట్లు వున్న ఆయన పాదాలు నాకు కనుపిస్తాయి. ఉల్లంఘించడానికి వీలులేని ఆజ్ఞలను ఆయన జారీచేయడం అప్పుడప్పుడు నేను వినేవాణ్ణి.

"ఆయన ప్రార్థనా సమావేశాలకు నే నెప్పుడు హాజరయినా; తెల్లటి వస్త్రాలు ధరించి అర్ధనిమీలిత నేత్రాలతో భగవంతుణ్ణి శరణుకోరుతున్నట్లు వంచిన తలతో వున్న ఆ బలహీనమైన ఆకారంలో ప్రేమనూ, విజ్ఞతనూ, సద్భావాన్నీ ప్రసరించే నాకు దురవగాహమైన ఏదో ఒక శక్తి ఉపకరణంగా ఆయన గోచరిస్తాడు."

అధికారం, హోదా, సంపద ఇచ్చే సదుపాయాలు ఏవీ గాంధీజీకి లేవు. భగవత్ సాన్నిధ్యమే ఆయన శక్తి. సత్యం, అహింస వెల్లివిరిసే రామరాజ్యాన్ని దర్శించగలగడమే ఆయన శక్తి. ఈ శక్తే ఆయనకు భారతీయుల హృదయాలను శాసించగల శక్తిని ప్రసాదించినది.

భారతజాతి స్మృతిపథంలో కాంతులీనే "ధర్మసామ్రాజ్యం" దర్శించినవాడు గాంధీజీ. దీనికే ఆయన ఒక కొత్తరూపాన్ని ఇచ్చి, దానిని సాధించడానికి కొత్తపంథాను మనకు ప్రసాదించాడు.

భారతదేశం క్లిష్టమైన, విపత్కరమైన పరిస్థితులను ఎదుర్కొన్నప్పుడల్లా, అవతారపురుషులు, యోగులు, మహర్షులు ప్రాతినిధ్యం వహించే హిందూమతం ఇట్టి ధర్మ

సామ్రాజ్యావిర్భావం జరుగగలదని బోధిస్తూనే వున్నది. ఇట్టి రాజ్యంలో అధర్మంస్థానే ధర్మం పరిపాలిస్తుంది.

మన సాంప్రదాయాలకు,ఆచారాలకు, మన శక్త్యుత్సాహాలకు ఉత్తేజాన్ని ప్రసాదించే మహాభారత, రామాయణాలు ధర్మం వెల్లివిరిసే ఒక వినూత్న ప్రపంచం ఆవిర్భవించ గలదనే విశ్వాసాన్ని ప్రజ్వలింప జేస్తూనే వున్నాయి.

ధర్మం అధర్మంచేత, విమలసత్యం అసత్యంచేత భంగ పడినప్పుడు తాను అవతారమెత్తి అధర్మాన్ని అణచి ధర్మాన్ని సంస్థాపిస్తానని కృష్ణభగవానుడు గీతలో చేసిన ప్రబోధం ప్రతియుగంలోను భారతీయులకు నూతనోత్తేజాన్నిస్తూనే ఉన్నది. కల్కి అవతారంలో భగవానుడు మళ్ళీ ధర్మాన్ని సంస్థాపించగలడని స్కాంధపురాణంలోని వాసుదేవ మహాత్మ్యం చాటుతున్నది.

మధ్యయుగంనాటి కాలంలో భారతదేశంలో హింస స్వైరవిహారం చేస్తున్నప్పుడుకూడా భారతీయాత్మ ఇట్టి విశ్వాసంతో ఉత్తేజితమైనది. రామరాజ్యం అవతరించ గలదని ప్రబోధించడం జరిగినది.

విశ్వాసం, ప్రేమ, ధర్మంలేని మరొక కొత్త ప్రపంచం గురించి బోధించే కొన్ని సిద్ధాంతాలున్నాయి. వీటికీ, గాంధీజీ భావాలకూ గల వైరుధ్యాన్ని వివరిస్తాను.

అటువంటి మరొక కొత్తప్రపంచం ప్రవక్త కారల్ మార్క్స్, హింసాత్మకమైన వర్గపోరాటంద్వారా వర్గరహిత సమాజాన్ని నిర్మించి భూతలాన్ని స్వర్గంగా మార్చివేయ

వచ్చునని బోధించాడు. ఈ స్వర్గ నిర్మాణానికి మానవ స్వభావాన్ని బలప్రయోగంద్వారా మార్చాలని ఆయన అంటున్నాడు.

శాస్త్ర విజ్ఞానము, సాంకేతిక విజ్ఞానము ఇవికూడా స్వర్గ నిర్మాణం సాధ్యమని ఋజువు చేయలేకపోతున్నాయి. సాంకేతిక విజ్ఞానాభివృద్ధిద్వారా అధికోత్పత్తి సాధ్యమే. కాని, ఇవి మన జీవితాలకు ఆధ్యాత్మిక, నైతిక విలువలను ఇవ్వలేకపోతున్నాయి. కనుక, ఇవి మానవస్వభావాన్ని మార్చగలట్టి శక్తిగలవి కావు.

1915లో దక్షిణాఫ్రికానుంచి గాంధీజీ భారతదేశానికి వచ్చినప్పుడు ఇక్కడి రాజకీయరంగం చాలా అధ్వాన్నంగా వున్నది. అప్పుడు దేశభక్తులకు రెండే మార్గాలున్నాయి : ఒకటి - గోఖలేను అనుసరిస్తూ చట్టబద్ధమైన ఆందోళనను కొనసాగించడం. రెండవది - హింసాత్మక పద్ధతులద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించగలమని విశ్వసించే విప్లవకారు (Terrorist) లను బలపర్చడం.

అట్టిసమయంలో అహింసాపద్ధతుల ద్వారా రామరాజ్యస్థాపన సాధ్యమని గాంధీజీ మూడవ పరిష్కారమార్గాన్ని సూచించారు. ఈ మూడవ పరిష్కారమార్గం కలలుకనే వ్యక్తి పిచ్చియూహ అని అప్పటి నాయకులు మొదట్లో కొట్టివేశారు. చాలామంది బహిరంగంగా ఈ సూచనను అపహాస్యం చేశారు. ప్రపంచజ్ఞానంలేని ఒక వ్యక్తి ప్రారంభించిన సాహసిక కృత్యం యిది అని వారు భావించారు.

అయితే, అహింస వెల్లివిరిసే సమాజ (దీనినే ఆయన రామరాజ్యం అని అన్నారు) నిర్మాణానికి ఆయన బోధించిన పద్ధతులు సవ్యమైనవేనని, అనంతరం ఆయన మార్గదర్శకత్వం వహించి నడిపిన ఉద్యమాలు ఋజువుచేశాయి.

గాంధీజీ ప్రసంగించేవారు, ప్రజలు కార్యోన్ముఖులయ్యేవారు.

గాంధీజీ బోధించిన అహింసాపద్ధతి బలహీనుని ఆయుధం కాదు - బలవంతుని ఆయుధమే. అహింసను గురించి 1920 వ సంవత్సరములో గాంధీజీ ఇలా వ్రాశారు: "అహింస అంటే మనకు హాని చేసేవారికి మనం లొంగిపోవడంకాదు. నియంతృత్వ శక్తిని ఆత్మశుద్ధితో వ్యతిరేకించడమే. భారతదేశం అహింసను అవలంబించాలని నేను అనడానికి కారణం అది బలహీనమైన దేశమనికాదు. తన బలాన్ని, శక్తిని గుర్తించే అహింసను భారతదేశం అవలంబించాలని నేను బోధిస్తున్నాను."

గాంధీజీ చేతుల్లో కాంగ్రెసువంటి సంస్థలు అహింసా పద్ధతిలో ప్రజాసమూహాలను నడిపించే ఉపకరణాలుగా రూపొందాయి.

ఒకవేళ మనం హింసాత్మకవిప్లవం నడిపి సాధించి వుండే ఫలితాలకన్నా గాంధీజీ కార్యకలాపాలవల్ల మనకు ఉదాత్తమైన ఫలితాలు కలిగాయి.

మానవాళి చరిత్రలోనే యిది అపూర్వమైన సంఘటన. అపారమైన బలంకల బ్రిటిష్‌సామ్రాజ్యానికి వ్యతిరే

కంగా అహింసాపద్ధతిలో ఉద్యమాలను గాంధీజీ నడిపి విజయాలు సాధించారు. శతాబ్దాల తరబడి బానిసత్వం అనుభవిస్తున్న భారతదేశంలో వీరోచితమైన సాంప్రదాయాలు నెలకొన్నాయి. పెద్ద దేశమైన భారతదేశంలో బ్రిటిష్‌వారి హయాంలో వున్న "ఉక్కు చట్రం" సివిల్, మిలిటరీ శాఖలు కాంగ్రెసు నాయకత్వానికి అప్పగించ బడినవి. ఈ కాంగ్రెసు సంస్థకు మార్గదర్శి, శిల్పి గాంధీజీయే.

గాంధీజీ నాయకత్వంలో మన సంఘంలో అద్భుతమైన సంస్కరణలు తేబడినవి. ఆరుకోట్లమంది అస్పృశ్యులు సమానత్వాన్ని సాధించుకున్నారు. సాంఘికంగా వెనుకబడిన తనాన్నుంచి మహిళలకు విముక్తి లభించినది. ఇతర విజయాలమాట అలా వుంచినా ఈ ఒక్క విజయంచాలు, గాంధీజీని ప్రవక్త అని అనడానికి.

దేశంలో నేటి అనేక ఉద్యమాలపై అయన ప్రభావం ఇంకా ప్రసరిస్తూనే వున్నది. ఉదాహరణకు వినోబాభావే భూదానోద్యమాన్ని తీసుకోండి. ఈ ఉద్యమం అద్భుతమైన విజయాలను సాధించినది. బలప్రయోగం లేకుండా భూసంస్కరణలను ప్రవేశపెట్టడానికిని ఈ ఉద్యమం ఒక మార్గాన్ని చూపెట్టింది.

గాంధీజీ మనమధ్య భౌతికంగా లేకపోయినప్పటికీ సత్యాగ్రహం బోధించిన ఈ ప్రవక్త ప్రభావం మనపైన ఎంతైనా వున్నది.

ప్రేమ, ఐచ్ఛికసహకారంతో ఉత్తేజితమైన అహింసాత్మక కార్యకలాపాలవలననే మానవాళిని వేధిస్తున్న

సంఘర్షణలకు, సమస్యలకు శాశ్వతమైన పరిష్కారమార్గాలు ఏర్పడగలవనే విశ్వాసం ఆలోచనాపరులైన చాలామందికి కల్గినది.

ప్రతిదేశంలోను కొద్దిమందిచేతుల్లో బలప్రయోగ, విధ్వంస ఉపకరణాలున్న నేడు గాంధీపథం ఆశాజ్యోతిగా వుంటున్నది.

దీని పర్యవసానంగా, అనర్థాలను, చివరకు యుద్ధాన్ని కూడా ప్రతిఘటించడానికి అహింస ఎంతవరకు ఉపయోగించగలదా? అని నేడు పలుదేశాలలోని మేధావులు పరిశీలించడం ప్రారంభించారు.

ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో జాతి విచక్షణకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటానికి ఆల్బర్ట్ లుథువి ఒక కొత్తమలుపు ఇచ్చారు.

నీకు నేషనల్ కాంగ్రెస్ నాయకత్వం కావాలా, గ్రాంట్ విల్లీమిషన్ రిజర్వ్ అధిపతిపదవి కావాలా అని దేశాంగశాఖ కార్యదర్శి అడిగినప్పుడు ఆల్బర్ట్ లుథువి ఇలా అన్నారు :

"చట్టబద్ధమైన ఆందోళన చేయడానికి వీలులేని ప్రజలకు అహింసాత్మకమైన ఉద్యమాలే మానవత్వంతో కూడిన పంథాగా అర్థంచేసుకుంటే, నా తెగప్రజలకు నేను అధిపతిగావుంటూనే కాంగ్రెస్‌లో నాయకుడుగా వుండటం అనేది తప్పుగా కనుపించదు."

అమెరికాలో జాతి విచక్షణకు వ్యతిరేకంగా డాక్టరు మార్టిన్‌లూథర్‌కింగ్ నడిపిన అహింసాత్మక ఉద్యమాన్ని బట్టే గాంధీజీ ప్రభావం ఎంతవున్నదీ తెలియగలదు.

గాంధీజీ ఫక్కీలో నాష్‌విల్లీలోని నీగ్రోవిద్యార్థులు ఈ క్రింది ప్రవర్తన నియమావళిని నిర్ణయించుకోవడం చాలా ఆసక్తిదాయకమైన విషయం.

నిన్ను నిందిస్తే తిరిగి నిందించవద్దు.

బహిరంగంగా బిగ్గరగా నవ్వవద్దు.

మీ నాయకుడు అనుజ్ఞఇచ్చేంతవరకు మీ మీ స్థానాలనుంచి కదలవద్దు.

అంగళ్ళు, దుకాణాలకు వెళ్ళే మార్గాలలో అవరోధంగా నిలువవద్దు.

అన్నివేళలలోను స్నేహం, మర్యాద చిప్పిల్లేటట్లు ప్రవర్తించు.

విపరీతమైన సంఘటన జరిగితే వెంటనే నాయకుడికి తెలియజేయి. నీ కందిన సమాచారాన్నంతా నీ నాయకుడికి నివేదించు.

ప్రేమ, అహింస - ఈ రెండింటినీ ఎప్పుడూ గుర్తుంచుకో. మీ అందరకూ భగవదాశీర్వాదం లభించుగాక!

సెల్మాలోని నీగ్రో ఓటర్లను నమోదు చేయాలని కోరుతూ నడిపిన ఉద్యమాన్ని మార్టిన్‌లూథర్‌కింగ్ గాంధీ ఫక్కీలో నడిపారు. అమెరికాలో ఈ సెల్మా శ్వేతజాతీయుల ఆధిక్యతకు పట్టుకొమ్మ.

"ఈ ఉద్యమాన్ని అహింసాపద్ధతులలో సృజనాత్మకంగా నడపనున్నాం" అని లూథర్ కింగ్ అప్పుడు అని వున్నారు.

అమెరికాలోని నీగ్రోలు నేడు టెర్రరిస్టు పద్ధతులను కాని, కమ్యూనిజాన్ని కాని అవలంబించడం లేదంటే అందుకు కారణం గాంధీజీ ప్రభావమే. జీవించివున్నప్పుడూ, మరణానంతరం గాంధీజీ ప్రభావం అటువంటిది.

పశ్చిమ దేశాలలో కూడా గాంధీజీ ప్రభావం సజీవంగా వున్నదనడానికి ఫ్రాన్సులోని లాంజా డెల్ వాస్టో ఒక ఉదాహరణము. 1937 వ సంవత్సరంలో డెల్ వాస్టో గాంధీజీని సందర్శించారు. గాంధీజంను అనుసరించే వ్యక్తులతో ఈయన ఒక సంఘాన్ని ఏర్పరిచారు. అహింసాపద్ధతిలో రాజకీయ ఉద్యమాలను నడపడానికి ఈయన ఒక పౌర సమితిని 1958 లో ఏర్పరిచారు. ఈ సమితి నిర్మాణనిబంధనలో ఇలా వున్నది: "సద్యఃఫలితాలనిచ్చే విప్లవమేదైనా వున్నదంటే అది గాంధీపంథాలో నడిచే విప్లవమే."

గాంధీజీ ప్రభావం, ఆయన సాధించిన విజయాలు హింసతో ప్రమేయంలేకుండా స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవడానికి గల నూతన మార్గాలను గురించి అన్వేషించేటట్టు చేసినవి.

హింసాత్మకమైన ఉద్యమాలలోకంటె అహింసావిధానంలో జరిగిన ఉద్యమాలలో జననష్టం, విధ్వంసం చాలా తక్కువగా వుండగలదని వీరు గుర్తించారు.

అయితే, అహింసావిధానంతో కూడిన ఉద్యమం యుద్ధానికి ప్రత్యామ్నాయం కాగలదా అన్నది సమస్య.

వాస్తవాలను మనం పరిశీలిద్దాం.

విజేతకు ఆధిక్యతను, సంపదను, బానిసలను సంపాదించిపెట్టే ఉపకరణంగా యుద్ధాన్ని పరిగణించడం వేలాది సంవత్సరాలుగా జరుగుతున్నది.

యుద్ధాన్నికోరేవారు అధికారంలో వున్నారు. డబ్బు వెదజల్లి శాస్త్రజ్ఞుల సేవలను కొనుక్కొని ఆయుధాలను ఉత్పత్తిచేసి రాజకీయసంస్థలు, ప్రచారసాధనాలద్వారా ప్రజలభావాలను తమ కనుగుణ్యంగా తీర్చి దిద్దుకొనగల్గుతున్నారు.

ప్రజలలో అధికసంఖ్యాకులు యుద్ధాన్ని కాంక్షించడంలేదు, యుద్ధాన్ని రద్దుచేయాలనే ఆంతరంగికంగా వారు కాంక్షిస్తూవుంటారు. అయితే, ప్రస్తుతవాతావరణం యుద్ధం అనివార్యం అనే భావాన్ని వ్యతిరేకించేటట్లుగా లేదు. ఎందుకంటే దేశాలు అనుసరించే జాతీయవిధానాలకు అవలంబనాలు -భయం, అవిశ్వాసం అయివుంటున్నాయి.

యుద్ధంపరిస్థితి నేడుకూడా, పెలోనీసియన్ యుద్ధం గురించి రెండువేల సంవత్సరాలక్రితం యసిడైడ్స్ వర్ణించినట్లుగానే వున్నది.

"సుఖంగావుండే దైనందినజీవితం యుద్ధంవలన ఛిన్నాభిన్నమైపోతుంది. హింసాత్మకవాతావరణానికి అనుగుణ్యంగా

యుద్ధం మనకు శిక్షణ నిస్తుంది. కొత్తపరిస్థితులకు అను గుణ్యంగా మనల్ని మారుస్తుంది. ఈ అనర్థాలన్నింటికీ కారణం సామ్రాజ్యవాదం. ఈ సామ్రాజ్యవాదులు యుద్ధానికి దిగడానికిగల ప్రధాన ప్రేరేపకాలు ఆధిక్యతాభావం, లోభత్వం. వీటినుంచి జాత్యహంకారం, వర్గపోరాటం బయలుదేరుతాయి. ఇరుపక్షాలలోనూ వున్న రాజకీయ వాదులు పెద్దపెద్ద నినాదాలు చేస్తారు. తాము ప్రజలసేవకుల మని, ప్రజల శ్రేయస్సును కాంక్షించే తాము యుద్ధానికి దిగామని ఇరుపక్షాల నాయకులు గొప్పలు చెప్పుకుంటారు. తమ ప్రత్యర్థులను రూపుమాపడమే వారి విధానం, ప్రధానోద్దేశ్యం. ఈ లక్ష్యాన్ని సాధించడానికి ఎంత నీచకృత్యాని కైనా వెనుదీయరు. పరస్పరం అవిశ్వాసంతో వుండే రెండు ప్రత్యర్థివర్గాలుగా సమాజం విభజింపబడిపోతుంది. ఏదో ఒక ఒప్పందానికి కట్టుబడి వుండవలసిన అవసరంలేదు కనుక ఈ సంఘర్షణను ఏదీ సమయింపచేయలేదు. భద్రతా లేమిభావం వలన ప్రతివాడూ తనను తాను రక్షించుకోవడానికి ప్రయత్నిస్తాడు. తన పొరుగువాడిని నమ్మలేడు.''

ప్రపంచం అంతటా యుద్ధం ఏదో ఒక రూపంలో జరుగుతూనే వున్నది.

అణ్వస్త్ర రాజ్యం కావాలన్న తహతహతో నగ్నమైన విస్తరణాకాంక్షతో వున్న చైనా, ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని దేశాల ఉనికికి ప్రమాదకరంగా తయారయినది.

యుద్ధాన్ని రద్దుచేయడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి.

యుద్ధాన్ని రద్దుచేయడానికి ఒక ఉపకరణంగా భావించబడిన ఐక్యరాజ్యసమితి పలుకుబడిగల దేశాలు వాగ్యుద్ధం చేసే వేదికగా తయారయినది. ఐక్యరాజ్యసమితి యుద్ధాన్ని నివారించలేదన్నది మనకు అనుభవైకవేద్యం.

నిరాయుధీకరణ ఒక నివారణమార్గంగా చాలామంది రాజకీయవేత్తలు భావిస్తున్నారు. నిరాయుధీకరణ సభలు ఒకటితరువాత ఒకటి పరంపరగా జరిగాయి. కాని, నిరాయుధీకరణ సాధింపబడలేదు. ఈనాడు శాంతి నెలకొనిఉన్నదంటే అణ్వాస్త్రబలం సమతూకంగా వుండటమే కారణం.

నిరాయుధీకరణ లక్ష్యసాధనకు ఏకపక్ష చర్యలు గైకొనాలని అల్పసంఖ్యాకులు కోరుతున్నారు. కాని, సైనిక శక్తిని పరిమితం చేసుకొనడానికి ఏ దేశమూ ఏకపక్షంగా అంగీకరించజాలదు. భవిష్యత్తులో జరిగే ఏదో మేలుకోసం ఏ దేశమూ వర్తమానంలో తన స్వాతంత్ర్యాన్ని త్యాగం చేయజాలదు.

అందువల్ల, క్రమబద్ధమైన రీతిలో హింసాత్మక శక్తులను విడుదలచేస్తున్న శత్రువును ఎదుర్కొనడానికి అహింసా విధానపూరితమైన పద్ధతులు విజయవంతం కావేమోనని అనేకమంది నేడు సందేహాలు వెలిబుచ్చుతున్నారు.

అహింస అనేది సిద్ధాంతరీత్యా ఎట్టి లోపమూ లేనట్టిది. అయితే, భగవద్గీతలో అర్జునుణ్ణి ఎదుర్కొన్న ద్వైదీభావమే అహింసావలంబికి ఎదురవుతూవుంటుంది. అహింస

అనేది హింసను విసర్జించే మానసిక వైఖరి కావాలి. కాని, హింసను హింసాత్మక పద్ధతులతో ఎదుర్కొనడానికి నిరాకరించడం మాత్రం కాదు. అతి ప్రాచీనకాలంలోకూడా ఈ అంశాన్ని గుర్తించడం జరిగినది. మహాభారతంలోని అరణ్యపర్వంలో ఇలా వున్నది :

"హింసకు పాల్పడని వ్యక్తి ఎవ్వరు ? అహింసకే కట్టుబడివున్న మహర్షులుకూడా హింస చేస్తారు; కాని విశేషమైన శ్రమతో ఈ హింసను వారు కనీసపరిమితికి కుదిస్తారు."

బ్రహ్మసూత్రాల భాష్యంలో శంకరాచార్యులు ఇలా వివరించారు : "ఒక ప్రదేశంలో ఒక పరిస్థితిలో ఒకకాలంలో పుణ్యంగా ధర్మంగా భావించబడే ఒక కర్మ, మరొక విభిన్నమైన ప్రదేశంలో కాలంలో పరిస్థితిలో పాపంగా, అధర్మంగా భావించబడుతున్నది."

ఈ పరిమితిని గాంధీజీ చాలా విస్పష్టంగా అవగాహన చేసుకొన్నారు. సత్యాగ్రహమనేది బలవంతుల ఆయుధం కాని, బలహీనతను కప్పిపుచ్చుకొనడానికి పిరికిపందలు ఉపయోగించే ఆచ్ఛాదనమాత్రం కాదని గాంధీజీ పదేపదే అనేవారు.

ఆత్మరక్షణకు హింసను ఉపయోగించే విధానపూరితమైన అహింసాపద్ధతిని మానవాళి దైనందిన సమస్యల పరిష్కారానికి కొన్నికొన్ని సందర్భాలలో ఉపయోగించవలసి వుంటుందన్న అంశాన్ని గాంధీజీ గుర్తించకపోలేదు.

గాంధీజీ వాస్తవికతావాది. దీనిలో వివిధ దశలలో విభిన్న పరిస్థితులలో అహింసాత్మక కార్యక్రమాల ద్వారా

మానవ సమాజమంతా ఏకకుటుంబంగా ఉండి అన్ని దేశాల వారు, వర్గాలవారు, జాతులవారు సమష్టి శ్రేయస్సాధనకు సహకరించుకుంటూ, దీనితోపాటు వ్యక్తి గౌరవము, అతడి ప్రాథమిక హక్కులు పరిరక్షింపబడుతూ, వ్యష్టి శ్రేయస్సాధన జరుగుతూవుండే సమాజ నిర్మాణానికి సుదీర్ఘమైన ప్రయాణాన్ని గాంధీజీ ఊహించారు.

గాంధీజీ నిర్దేశించిన అట్టి సత్యం, అహింస వెల్లి విరిసే సమాజాన్ని కార్డినల్ సుయెనెన్స్ కంటె ఎవ్వరు చక్కగా అభివర్ణించగలరు? 1963 మే 15 వ తేదీన ఐక్య రాజ్యసమితిలో ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నారు: "అన్ని దేశాల ప్రజల మధ్య శాంతి వుండాలంటే దానికి సత్యం పునాది కావాలి, న్యాయం దాని సూత్రం కావాలి, ప్రేమ దాని చోదనశక్తి కావాలి, స్వేచ్ఛ దాని వాతావరణం కావాలి."

అహింస వెల్లివిరిసే సమాజనిర్మాణానికి నిర్దేశించిన పథం సుదీర్ఘమైనది కావచ్చును. కాని, ఈ క్రింది చర్యలను గైకొంటే ఈ ప్రయాణాన్ని త్వరితంచేయవచ్చునని గాంధీజం వివరిస్తున్నది:

మొదటిది :- మానవజీవితంలో రూపం ధరించిన అన్ని రంగాలలోని సంఘర్షణలను హింసాత్మకపద్ధతులతో కాక శాంతియుత చర్చలద్వారా పరిష్కరించుకొనడం అనివార్యం.

రెండవది :- సమాజంలోని రాజకీయ, సాంఘిక సంస్థల నన్నింటినీ సర్వోదయా (అందరి శ్రేయస్సు) నికి

ఉన్ముఖం చేయాలి. అంతేకాని ఎట్టి పరిస్థితులలోను అధి కారంలో వున్న వారి పదవీవ్యామోహాన్ని తీర్చే ఉపకరణాలుగా తయారు కావడాన్ని అనుమతించరాదు.

మూడవది :- పురోభివృద్ధికి ఉపకరణంగా ప్రజల ఆలోచనాధోరణిని ప్రవర్తనను ప్రభుత్వం క్రమబద్ధం చేయడాన్ని తిరస్కరించాలి. సంపదపైన ధనవంతులు ఐచ్ఛికంగా ధర్మకర్తృత్వం వహించేవిధంగా పెట్టుబడిదారీవిధానం పరివర్తన పొందాలి. వ్యష్టి, సమష్టి శ్రేయస్సుకు అనుగుణ్యమైన పవిత్రవంతమైన జీవితాన్ని గడిపేలా వ్యక్తిని ప్రోత్సహించాలి. తన సృజనాత్మక శక్తిలో వ్యక్తికి విశ్వాసం వుండాలి.

నాలుగవది :- సమాజంలో ప్రాథమిక స్థితిగా వ్యక్తికి రాజకీయంగాను, సాంఘికంగాను పూర్తి స్వేచ్ఛ వుండాలన్న అంశాన్ని గుర్తించాలి. సంస్థలకు, సంఘాలకు విస్తృత ప్రాతిపదికపైన కార్యాచరణ స్వేచ్ఛ వుండాలి.

ఐదవది :- ప్రతిస్థాయిలోనూ అందులోను ప్రత్యేకంగా విశ్వవిద్యాలయం స్థాయిలో గాంధీతత్వం గురించి, అహింసావిధానం గురించి బోధించాలి. ఇందువల్ల అహింసా విధానం స్వార్థప్రయోజనాలకు వినియోగం కాకుండాను, హింసాత్మక విప్లవం తేవడానికి ఉపకరణంగా తయారు కాకుండాను చూడడం అవుతుంది.

ఆరవది :- దేశంలోని నియంతృత్వం, విదేశీదురాక్రమణ వీటితోసహా జీవితంలోని అన్ని అనర్థాలను ఎదుర్కొన

డానికి నైతికమైన, ఆధ్యాత్మికమైన శక్తియుక్తులు గల పురుషులు, స్త్రీలు సమావేశమవుతూ వుండాలి. ప్రజాస్వామ్యం వ్యక్తిస్వేచ్ఛకు అనుగుణ్యంగావుండే అధికారాన్ని అహింసావిధానాన్ని బోధించే గాంధిపథం ద్వారానే సాధించడం సాధ్యం కాగలదని, ప్రజాబాహుళ్యానికి అట్టి పురుషులు, స్త్రీలు (సంఖ్యలో తక్కువైనప్పటికీ) నచ్చజెప్ప కలుగుతారు.

ఇట్టి పరిస్థితులు గట్టిగా యేర్పడడానికి చాలా తరాలు పట్టేమాట వాస్తవమే. "ఒక చిన్న చర్య అయినాసరే బృహత్తరమైన ప్రమాదాన్ని నిరోధించగలదు" అని భగవద్గీత బోధిస్తున్నది.

ఒక్కవిషయం మట్టుకు తథ్యం : అహింసావిధానం వెల్లివిరిసే సమాజం నిర్మాణం కావాలని బోధించిన ప్రవక్త గాంధీజీతత్వం హింసపై విజయం సాధించడంలో పురోగమిస్తూనే వున్నది.

# గాంధీ తత్త్వం గాంధీ దృక్పథం

కె. యం. మున్షి



గాంధీ సాహిత్య ప్రచురణాలయము
చిక్కడపల్లి • హైదరాబాద్-20